Registered No. M-4484.

# యుద్ధ సందేశ

వాల్యుం II.] 1942 వ సం॥ ఆగస్టు నెల 14 వ తేదీ శుక్రవారం [నె 32 రు.

## జయప్రదమైన బొమ్మ



ఈ పటములోని బ్రిటిష్ వైమానికుడు దక్షిణాఫ్రికానుంచి వచ్చి ఇంగ్లాండులో వైమానికదళంలో పనిచేస్తున్నాడు. అతని ప్రాణం కాపాడే జాకెట్టు చొక్కామీద ఒక జంతువు బొమ్మ వేయబడియున్నది ఆ బొమ్మను చూపిస్తున్నాడు. ఆ జంతువు దక్షిణాఫ్రికాలోవుండే ఒకవిధమైన లేడి. ఆ బొమ్మ అతని చొక్కామీద వుండుటవల్ల అతని కది జయప్రదంగా వుంది. ఒక రోజున ఇంగ్లీషుకానెలుమీదకు ఇతడు ఎగిరివెళ్లి అర నిమిషంలో రెండు జర్మను విమానములను పడగొట్టినాడు. ఇతడు మొత్తం 4 జర్మను విమానములను ధ్వంసం చేసాడు. ఒక జర్మను విమానమును చెడగొట్టినాడు.

## కాంగ్రెసు తీర్మానము: దాని అంతరార్థము.

ఇండియా కార్యదర్శియైన అమెరీగారు ఆగస్టు 10 వ తేదిని అమెరికా ప్రజల నుద్దేశించి రేడియో ప్రసంగమొకటి చేశారు. ఆ రేడియో ప్రసంగములో యీ క్రింది విధంగా చెప్పియున్నారు:—

"యుద్ధ విజయానంతరము భారతదేశము తన భవిష్యత్తును తానే నిర్ణయించుకొనగల సంపూర్ణ స్వాతంత్ర్యావకాశము కల్గి బ్రిటిషు సామ్రాజ్యములోని స్వతంత్ర దేశాలలోను ప్రపంచములోని స్వతంత్ర దేశాలలోను, భారతదేశంకూడా ఒక స్వతంత్ర దేశంగా ఉండగలదనిన్నీ, భారతీయులు తమంతట తాము నిర్ణయించుకొన్న రాజ్యాంగ విధానమునే కలిగియుండవలెననిన్నీ, ఆంగ్ల ప్రభుత్వమున్నూ, ఇండియా గవర్నమెంటున్నూ ఒక విశాల సంకల్పోద్దేశము కలిగియున్నవి. కాని పెక్కు ప్రాంతాల పాక్షిక కాంగ్రెసు నాయకుల చర్యలు ఎటువంటివైనప్పటికీ, బ్రిటిషు గవర్నమెంటు యొక్క సంకల్పము మాత్రము అందువల్ల మార్పు చెందజాలదు. ఇండియాకున్నూ అఖిల ప్రపంచమునకున్నూ యీ మాట ప్రమాణంచేసి చెప్పుచున్నాము. ఈ మాటమీదనే మేము నిలుకబడెదము."

బ్రిటిషువారు తమ మాటప్రకారము తాము తప్పక చెల్లించగలరని తిరిగి నొక్కి వక్కాణించినప్పటికీ, కాంగ్రెసు నాయకులకు తృప్తి కలుగదు. ఎందుచేతనంటే, "సంపూర్ణాధికారము గల జాతీయ మంత్రివర్గము వెంటనే ఇప్పుడే ఇండియాలో ఏర్పడవలెనని కాంగ్రెసువారు కోరుచు

న్నారు. కాంగ్రెసువారు కోరిన ప్రకారముగా యావత్తు అధికారములను ప్రజా ప్రతినిధులగు మంత్రులకు ఒప్పగించవలెనంటే, పార్లమెంటు వారిచే శాసింపబడిన ఇండియారాజ్యాంగచట్టములో చాలా పెద్ద మార్పులు కొన్ని జరగాలి. ఆ మార్పులలో కొన్ని చాలా క్లిష్టమైన విషయములుగా నున్నవి. ఈ మాట నిజమేయని కాంగ్రెసు నాయకులుకూడా ఒప్పుకున్నారు. కాని, ఎంత పెద్ద మార్పు అయినాసరే, యుద్ధ సమయంలో అటువంటి ఆక్షేపణ చెప్పకూడదనిన్నీ, రాజ్యాంగ చట్టములో అటువంటి పెద్ద మార్పునుకూడా యిప్పుడే చేయవలెననిన్నీ, కాంగ్రెసు నాయకులు వాదించారు.

ఈఅధికార విధాన సంబంధమైన మార్పులో గల సాధక బాధకములను, ప్రొఫెసరు కూప్లాండుగారు యీ క్రింది రీతిగా సంగ్రహంగా మనవి చేశారు.

> "స్వతంత్ర సంపూర్ణాధికారంగల జాతీయ మంత్రి వర్గం ఏర్పడితే, సైనిక సంబంధమైన యుద్ధ వ్యవహారముల విషయంలోమాత్రము జాతీయ మంత్రి వర్గమునకు అధికారం యివ్వకుండా ఆ వ్యవహార శాఖను మాత్రము మినహాయించవచ్చునని కాంగ్రెసు కమిటీవారు అన్నారు. కాని, యుద్ధసంబంధమైన సైనిక శాఖాధికారములను మిగిలిన వ్యవహార శాఖాధికారములనుండి వేరుచేసి విభజించి మాట్లాడుటకు వీలులేదు చిట్టచివరకు కార్యాచరణలోనికి వచ్చేసరికి, యుద్ధ శాఖాధికారమున్నూ తదితర వ్యవహారశాఖాధికారములున్నూ ఒక్క అధికారికే ఒప్పగించక తప్పదు. యుద్ధ సమయంలో, సైనిక వ్యవహారమును సమర్థంగా నిర్వహించవలెనంటే, మంత్రి వర్గంలో ఉన్న వారందరూ తన మాట తప్పకుండా శిరసావహిస్తారనే గారంటీ సర్వసేనాధిపతికి ఉండవలెను"

ఈ క్రింద చెప్పబడిన నాలుగు ముఖ్య విషయములను బాగుగా గమనించాలి :—

(1) యుద్ధ సమయములో, దేశ మధ్యంలోనున్న ప్రజల శాంతి భద్రతలకు భంగము లేకుండా చూడవలెను. సివిలు శాఖల మంత్రులు యీ పని సమర్థించుకొని నిర్వహించలేకపోతే, అప్పుడు స్వదేశ పోలీసు వ్యవహార శాఖాధికారియైన హోం మెంబరు సైనికాధికారి మాట ప్రకారముగా పనిచేయవలసివచ్చును. లేనియెడల దేశమధ్యంలోని విషమ పరిస్థితులను చక్కబరచుటకు వీలుండదు.

(2) బ్రిటిషువారు యితర దేశాలతో జరుపుచున్న విదేశాంగ తంత్రములో సంబంధము లేకుండా, యీ యుద్ధ సమయంలో, భారత దేశము తానే విదేశాంగ వ్యవహారములను తన కిష్టమైన రీతిగా స్వతంత్రంగా సాగించెదనని చెప్పుటకు వీలులేదు,

(3) భారత దేశంలోని యావత్తు పరిపాలనయున్నూ, ఐ.సి.యస్. ఆఫీసర్లమీద (ఇండియను సివిలు సర్వీసు) అనగా కలెక్టరు పరీక్ష ప్యాసయినవారిమీద ఆధారపడియున్నది. అట్టి వారిలో సగముమంది భారతీయులు. ఇండియను పోలీసు అధికారులమీదకూడా ప్రభుత్వ పరిపాలన ఆధారపడియున్నది. వీరిలో మూడవ వంతు భారతీయులుగా ఉన్నారు. ఈ ఆఫీసర్ల వ్యవహార చర్యలకున్నూ, వారి ఉద్యోగ క్షేమ భద్రతకున్నూ ఇండియా కార్యదర్శి బ్రిటిషు పార్లమెంటుకు జవాబుదారీ వహించియున్నాడు.

(4) ఇండియాలోని స్వదేశ సంస్థానములయెడల, బ్రిటిష్ గవర్నమెంటువారు కొన్ని బాధ్యతలను వహించియున్నారు. ఈ యుద్ధంలో స్వదేశ సంస్థానములుకూడా పాల్గొనుచున్నవి. కనుక, బ్రిటిష్ గవర్నమెంటువారు, సంస్థానముల యెడల తమకుగల బాధ్యతల నన్నింటినీ, ముందు వెనుక ఆలోచించకుండా, ఒక్క మాటతో తొలగించుకొనుటకు సాధ్యం కాదు. యుద్ధం జరుగుతున్న యీ సమయంలో అది అంతకన్నా సాధ్యమయ్యే పనికాదు.

పైె చెప్పిన విషయములన్నియు సంగ్రహంగా ప్రొఫెసరు కూప్లాండుగారు ఒక్క మాటలో యీ క్రింది రీతిగాచెప్పిరి :—

"సైనికశాఖా వ్యవహారంతో అవినాభావ సంబంధముగల సివిలు వ్యవహారాధికారంకూడా కొంత విధిగా ఉండగలదు. కనుక అటువంటి సివిలు అధికారం బ్రిటిష్‌వారి వశమందే యుండవలెను. అదికూడా తొలగిపోవలెనంటే, రాజ్యాంగ చట్టమునే సమూలంగా మార్పుచెయ్యవలెను. యుద్ధం పూర్తిఅయిన తర్వాత, ఆ సైనికాధికారమున్నూ, దానితోబాటు ఉండవలసిన కొంత సివిలు అధికారమున్నూ, రెండున్నూ బ్రిటిష్‌వారి చేతులలోనుండి తొలగిపోగలవు. అంతవరకూ, ఆ రెండూ బ్రిటిష్‌వారి చేతులలోనే ఉండవలెను,"

# కాంగ్రెసు నాయకుల మనస్సులలోవున్న అభిప్రాయాలు.

అలహాబాదులో ఏప్రిలు మాసాంత్యమున కాంగ్రెసు వర్కింగు కమిటీ సమావేశమై జరిపిన చర్చలను, ఆ సభలో గాంధిగారు తయారుచేసిన చిత్తు తీర్మానమును, పండిత నెహ్రూగారు దిద్ది సవరించి తిరిగి తయారుచేసిన తీర్మానమును, గవర్నమెంటువారిటీవల ప్రకటించియున్నారు. కాంగ్రెసు నాయకుల నిజసంకల్పములు ఆ రికార్డువల్ల తేట తెల్లమగుచున్నవి. ఇండియాలో మిత్ర మండలి సేనలు ఉండడంవల్లనే, ఇండియామీదకు జపానువాళ్లు దండెత్తవలెననే ఆకర్షణ ఏర్పడుతున్నది. కనుక, ఇండియాలోనుంచి బ్రిటిష్ సైన్యాలున్నూ మిత్ర రాజ్యాల సైన్యాలున్నూ తొలగిపోవలెనని గాంధీగారు కోరియున్నారు. ఆ ప్రకారంగానే మొట్టమొదటి చిత్తు తీర్మానమును గాంధీగారు మే నెల 1 వ తేదిని తయారుచేసియుండిరి.

బ్రిటిష్ పటాలములు యీ దేశమునుండి తొలగిపోయినట్లయితే, జపానువారితో భారత దేశం తన యిష్టము వచ్చిన రీతిగా రాయబారములు నడుపుకోవచ్చునని ఆ చిత్తు తీర్మానములో స్పష్టంగా చెప్పబడివున్నది, కాని, మిత్రరాజ్యాలకు సహాయం చేయవలెనని ప్రతిజ్ఞ వహించియున్నవారు కొందరు ఆ చిత్తు తీర్మానమును ఆమోదించలేదు. అందువల్ల ఆ నాడు జరిగిన అలహాబాదు సభలో ఆ తీర్మానమును తిరిగి సవరించి వ్రాసినారు. ఆఖరుకు సవరింపబడిన తీర్మానం అధ్యక్షుని ప్రోద్బలంవల్ల సభలో ఆమోదింపబడింది. తన మొదటి తీర్మానం సవరింపబడి మార్పు చేయబడినందుకు గాంధీగారికి కోపం వచ్చింది. భారత దేశం స్వతంత్రంగా జపానువారితో మాట్లాడుకొని వ్యవహార పరిష్కారం చేసుకోగల్గుటకై బ్రిటిష్ సేనలున్నూ, మిత్రరాజ్యాల సేనలున్నూ ఇండియానుంచి వెళ్లిపోవలెననే మాటను భారతదేశంలో హర్షించేవారు లేరు. బయటి దేశాలలోను హర్షించరు. అందువల్ల సేనలను తొలగించ నక్కరలేదనిన్నీ బ్రిటిష్వారు తమ రాజకీయాధికారమును మాత్రమే తొలగిస్తేచాలుననిన్నీ చెప్పి తన మాట మార్చుకున్నారు. జపానువాళ్లు ఇండియామీదకు దండెత్తివస్తే కాంగ్రెసువారు ఏవిధంగా వాళ్లను ఎదిరించి పోరాడుతారో ఆ విషయమును కాంగ్రెసు నాయకులు నిర్ణయించలేదు. ఎవరికి తోచిన రీతిగా వారు ఆ విషయంలో మాట్లాడుతున్నారు. జపానువారితో రాయబారాలు సాగించి స్వతంత్రంగా భారతదేశం తనకు తోచిన రీతిగా జపానుతో వ్యవహార పరిష్కారము చేసికోవలెనని 3 మాసాలక్రిందట కాంగ్రెసువారు కోరి, అందుకొరకై తమకు సంపూర్ణ పరిపాలనాధికార స్వాతంత్ర్యం ఇచ్చివేయవలసినదని అన్నారు. కాని యింతలోనే యీ 3 మాసాలలోనే జరిగిన గొప్ప మార్పు ఏమిటి? కాంగ్రెసువారు జపానును ఎదిరించి పోరాడుటకు నిశ్చయించినామనిన్నీ, అందుకొరకే సంపూర్ణ స్వాతంత్ర్యాధికారం తమకు కావలెననిన్నీ చాటించుటకు గల నూతన సందర్భ కారణము లేమి కలవు? ఈ మాట నమ్మి కాంగ్రెసువారికి దేశపరిపాలనాధికారములో సంపూర్ణ స్వాతంత్ర్యము ను ఇచ్చిన వెంటనే, వారు జపానువారితో సంప్రతింపులు సాగించుటకు పూనుకొనరని నిర్భయంగా ఎవరు చెప్పగలరు? ఆంతరంగికంగా రహస్యంగా చేసిన చర్చలలోనే వారి మనోగత భావాలు వెల్లడి అవుతూ ఉంటాయి. అందువల్ల అలహాబాదులో జరిగిన కాంగ్రెసు వర్కింగు కమిటీ చర్చలను యధాతథంగా గవర్నమెంటువారు ప్రకటించడమైనది. కాంగ్రెసువారు ఆ ప్రకటనకు ఏమి జవాబు చెప్పగలరో గవర్నమెంటువారు చూడదలంచిరి.

# శత్రువుల దుష్ప్రచారం: కాంగ్రెసుకు ప్రోత్సాహం.

తమకు యిప్పుడు యీ యుద్ధ సమయంలో వెంటనే సంపూర్ణ స్వాతంత్ర్యాధికారమును బ్రిటిష్ వారు యివ్వనియెడల శత్రువులను జయించుటకు సహాయం చేయము అనిన్నీ, సత్యాగ్రహం చేస్తామనిన్నీ కాంగ్రెసువారు బెదరిస్తున్నారు. ఇందుకు శత్రురాజ్యాలవారు చాలా సంతోషిస్తూ తమ రేడియోలద్వారా కాంగ్రెసు ధోరణిని మెచ్చుకొనుచూ, ప్రోత్సహిస్తూ ప్రచారం చేస్తున్నారు. గత జూలై 11 వ తేదీని సైగాను రేడియో ద్వారా జపానువాళ్లు ఏమని చెప్పినారో వినండి—"జపానువారు కాంగ్రెసు తీర్మానమునకై ఎదురు చూస్తున్నారు. బ్రిటిష్‌వారిని ఇండియానుంచి కాంగ్రెసువారే వెళ్లగొట్టగల్గితే మంచిది. అట్టి సందర్భంలో ఇండియామీదకు జపాను దండెత్తదు. ఇండియానుంచి బ్రిటిష్‌వారిని కాంగ్రెసు సభవారు వెళ్లగొట్టలేని పక్షమందు ఇండియాపై జపాను దండెత్తును." జూలై 27 వ తేదీని జపాను ప్రధానమంత్రియైన టోజో రేడియోలో ఉపన్యసిస్తూ యిట్లు చెప్పెను:—

"చైనా, ఆస్ట్రేలియా, ఇండియా, ఇంకా మధ్యప్రాచ్య రాజ్యాలు, వీటిమీదకు జపాను తీవ్రంగా దండయాత్ర సాగించగలదు. ఆస్ట్రేలియా విషయంలో దాక్షిణ్యమనేది చూపించము. భారతదేశ నాయకుల దూరదృష్టి మాత్రము చాలా మెచ్చుకోదగినది." ఇండియాలో ప్రజలందరూ సత్యాగ్రహంచేసి బ్రిటిష్ గవర్నమెంటును ధిక్కరించినట్లయితే, జపానువారికి చాలా పని తగ్గిపోతుంది. అందువల్ల భారతీయులను కొనియాడుతూ, ఉబ్బించుచు, బుజ్జగించుచు, మిత్రమండలి సేనలను ఇండియానుంచి వెళ్లగొట్టవలసినదిగా జపానువారు ప్రోత్సహించుచున్నారు. అందువల్లనే, బర్మాలోని జపాను వారి మకాములమీద బ్రిటిష్ విమానాలు ఎన్ని పర్యాయములు దాడి వెడలి, ఎన్ని బాంబులువేసి ఎంత ధ్వంసం చేసినను, అందుకు ప్రతీకారంగా జపానువారు ఇండియామీదకు విమానదాడులను సాగించుటలేదు. గత 4 మాసములలో 11 విమానదాడులను మాత్రమే జపానువారు జరిపియున్నారు. "జపానువారి జలాంతర్గాములు ఇండియా సమీపంలోనే బంగాళాఖాతంలో తిరుగుచున్నప్పటికీ, ఇండియాకు చాలా సమీపంలో జపాను విమానాలు చేర్చబడియున్నప్పటికీ, ఇండియాలోని రేవులమీద జపాను జలాంతర్గాములు ఫిరంగులను కాల్చుటలేదు. జపాను విమానాలు ఇండియాలోని పట్టణములపైకి వచ్చి బాంబులు వేయడంలేదు. భారతదేశముయెడల జపానువారికి గల అభిమానానురాగంవల్లనే, జపానువారు ఆవిధంగా చేయడం లేదు" అని సైగాను రేడియోలో జూలై 11 వ తేదిని జపానువాళ్లు పల్కియున్నారు. కాంగ్రెసువారు సంకల్పించిన పనికి "చాలా సంతోషిస్తున్నాము" అని అంటున్నారు.

---

# క్రిప్సుగారు సూచించిన పరిష్కార మార్గము.

సర్ స్టాఫర్డు క్రిప్సుగారు ఇండియాకువచ్చి ఒక వాగ్దానమును చేసారు. అందులో యీ క్రింది రెండు ముఖ్య విషయాలు ఉన్నాయి: యుద్ధానంతరము భారతదేశానికి ఎటువంటి స్వతంత్ర స్వపరిపాలన ఉండవలెనో, దేశంలోని పెద్ద రాజకీయ పక్షములవారు ఏకీభవించి నిర్ణయించుకోవలెను. రెండవ విషయమేమిటంటే, తాత్కాలికంగా యీ యుద్ధం జరిగినంతవరకూ, పైజెప్పిన పద్ధతిగానే దేశంలోని పెద్ద రాజకీయ పక్షములవారు కలిసి ప్రజాప్రతినిధి ప్రభుత్వవర్గమును ఏర్పాటుచేయవలెను.

ఇండియా రాజ్యాంగ చట్టములో చేయవలసిన పెద్ద మార్పుల నన్నింటిని, ఇప్పుడే వెంటనే చేయవలసినదని కాంగ్రెసు నాయకులు కోరినప్పటికీ, మహమ్మదీయ పక్షమువారు, అనగా ముస్లిం లీగువారు అందుకు అంగీకరించనందున, అట్టి పెద్ద మార్పులను రాజ్యాంగ చట్టములో ఇప్పుడు చేయుటకు సాధ్యముకాదని క్రిప్సుగారు జవాబుచెప్పిరి. కాంగ్రెసువారి కోరికలను బ్రిటిష్ వారు ఆమోదించినట్లయితే, యీ దేశంలోని మహమ్మదీయులు కాంగ్రెసువారి దయాదాక్షిణ్యములపై ఆధారపడి బ్రతుకవలసియుంటారని

ఏప్రెలు 13 వ తేదిని ముస్లిం లీగు నాయకులైన జిన్నాగారు అన్నారు.

ఇండియా రాజ్యాంగచట్టమును సమూలంగా మార్పుచేయుటకు యీ యుద్ధసమయంలో, శత్రువులు మనమీదకు వచ్చుచున్న సమయంలో సాధ్యపడదు. అదిన్నీగాక, అట్టి మార్పుల విషయంలో దేశంలోని భిన్న రాజకీయ పక్షములు ఏకీభవించుటలేదు. ఇంకొక పెద్ద విషయం ఏమిటంటే, బ్రహ్మాండమైన బ్రిటిష్ సేన ఇండియాలో నేడు చేర్చబడియున్నది. ప్రపంచ సంగ్రామంలో భారతదేశం నేడు ఆయువుపట్టువంటి యుద్ధరంగంగాఉంది. ఇటువంటి సమయంలో ఇండియారాజ్యాంగచట్టమును సమూలంగా మార్పుచేసి ప్రభుత్వాధికారమును తారుమారు చేయుటకు వీలు లేదు.

మరొక విషయం కూడా యీ సందర్భంలో చెప్పవలసియున్నది, ఆయా రాష్ట్రములలో ఇటీవల కాంగ్రెసు మంత్రులు అధికారము వహించి వ్యవహరించియుండిరి. ఇండియా రాజ్యాంగ చట్టములో కొన్ని నియమ నిబంధనలు బందోబస్తుకొరకై ఉండినప్పటికీ, గవర్నరులవల్ల ఆటంకములు లేకుండానే ఆయా రాష్ట్రములలోని మంత్రులు రాష్ట్రీయ స్వపరిపాలనాధికారమును చలాయించియున్నారు. కనుక, రాజ్యాంగ చట్టములో ఉన్న ప్రతిబంధక నిబంధనలవల్ల ఆటంకము లేకుండానే మంత్రులున్నూ గవర్నరులున్నూ కలిసి వ్యవహరించిన రీతిగానే, వైస్రాయియున్నూ క్రొత్తగా ఏర్పాటు చేయదగిన ప్రజాప్రతినిధి మంత్రులున్నూ కలిసి అన్యోన్యంగా వ్యవహరించవచ్చును. ఆ విధంగా జరిగితే, ఇండియాలో స్వతంత్రమైన జాతీయ ప్రభుత్వవర్గము అమలులోనికి వచ్చినట్లగును. కనుక యుద్ధము పూర్తి అయ్యేవరకు యీవిధంగా తాత్కాలిక ప్రభుత్వవర్గము నొకదానిని ఏర్పాటు చేయవచ్చును. దేశములోని ప్రధాన రాజకీయ పక్షముల ప్రతినిధులు ఆ ప్రభుత్వవర్గములో చేరియుండగలరు. అంతేగాక, ఇంగ్లండులోని యుద్ధమండలిలో ఇండియా ప్రతినిధికూడా ఉండగలడు. పసిఫిక్కు యుద్ధ మండలిలోకూడా భారతదేశ ప్రతినిధి యుండగలడు. ఈ విధంగా యుద్ధ తంత్రమంతయును భారతదేశముకూడా బాధ్యత వహించి నడిపించుటకు తోడ్పడగలదు.

---

# భారతదేశరక్షణ సలహాసంఘ పర్యటనము.

భారతదేశ రక్షణ విషయములో సంప్రతించుట కొరకున్నూ, సలహాల నిచ్చుటకొరకున్నూ, ఢిల్లీ శాసన సభవారిచే ఒక సంప్రతింపు సంఘం ఏర్పాటుచేయబడెను. దానికి గౌ॥ పండిట్ హృదయనాథకుంజ్రూగారు అధ్యక్షులు. గౌ॥ సర్దార్ ఘూటాసింగుగారును, సర్ ఫ్రెడరిక్కు జేమ్సుగారును, హుస్సేను భాయి ఏ. లాల్జీగారును, జమ్నా దాసు మెహతాగారును, దేశముఖుగారును, ఘయాజుద్దీనుగారును, ఆ సంప్రతింపు సంఘములో మెంబర్లు. ఇండియా తూర్పు భాగంలోని కోస్తాప్రాంత రక్షణ ఏర్పాట్లను, ఇతర సైనిక మకాములను యీ కమిటీవారు సందర్శించిరి. ఆ ప్రాంతములందు అందుకొరకై పర్యటనంచేసిరి. మందు సామగ్రి ఫ్యాక్టరీలను, విమానాశ్రయములను, ఉక్కుయినుము ఫ్యాక్టరీలను, కార్ఖానాలను అనేకం చూచివచ్చిరి. సోల్జరుల ఉత్సాహ ధైర్యములన్నూ, వారికి యివ్వబడిన ఆయుధ పరికరములున్నూ, చాలా సంతృప్తికరముగా నున్నవని మెచ్చుకొనిరి. మన పటాలములు అహోరాత్రములు పొందుచున్న శిక్షణను వారుచూచి, ప్రపంచములోకెల్ల అసమానమైన సైనిక శిక్షణ యొసంగబడుచున్నదని ప్రశంసించిరి. భారతీయ సైనికులున్నూ, బ్రిటిష్ సోల్జరులున్నూ ఎక్కువ అన్యోన్యంగా పనిచేయుచున్నారనే విషయం ఎక్కువగా ప్రశంసించారు.

ఆధునిక యుద్ధ పరికరములు అనేకము ఆయుధ కర్మాగారములలో తయారుచేయబడుచుండుట వారు చూచిరి. ఈ ఫ్యాక్టరీలలో పనిచేయుచున్నవారును, సైన్యములలోని సైనికులును చాలా క్రొత్త రకములైన ఆయుధములనే ఉత్పత్తిచేసి ఉపయోగించుచున్నారని కమిటీ మెంబర్లు చాలా సంతృప్తి చెందిరి.

# బర్మాలోని రోడ్లు, రైలు మార్గములపై బ్రిటిషు విమానదాడి.

## టన్నులకొలది ఆహార పదార్థములను బర్మాలో బ్రిటిషు విమానాలు సప్లయి చేయుట.

శత్రువుల ఆక్రమణలోనున్న బర్మాలోని రైలు మార్గములమీదను రస్తాలమీదను, నదీ మార్గములమీదను బ్రిటిష్ విమానములు తీవ్రమైన దాడి సాగించి బాంబులను వేసెను. అదిగాక, గత జూలై మాసంలో బర్మాలోని ప్రజల కొరకై 430 టన్నుల ఆహార పదార్థములను, వైద్య సంబంధమైన సామగ్రులను, అత్యంతావశ్యకమైన కొన్ని సరకులను బ్రిటిష్ విమానములున్నూ, అమెరికను విమానములున్నూ, చైనా విమానములున్నూ బర్మాలో కొన్ని చోట్ల పడవేసెను.

చాడ్విను నదిమీదనున్న కలేవామీద డజను పర్యాయములు బ్రిటిష్ విమానాలు బాంబులు వేసెను. అచటి జపాను సేనలమీద బాంబు ప్రయోగాలు చేయబడెను. చాడ్విను నదివద్ద ఉన్న కాలెమియో సమీపంలోకూడా తీవ్రంగా బాంబు ప్రయోగాలు జరుపబడెను. మాండలే నుంచి రంగూనుకు పోవు రైలు మార్గముమీద జూలై 27 వ తేదీని బాంబులు వేయబడెను. టార్జి స్టేషనుమీదను మాండలే స్టేషనుమీదను ఎక్కువగా వేయబడెను. అచటి ఇంజన్లు, రైలు బళ్లు తగులబడెను. చాడ్వినుకొండ కనుమ మార్గములలో పోవుచుండిన మోటారు లారీలమీదకూడ బాంబులు వేయబడెను. అనేక రైలు స్టేషనులమీద బ్రిటిష్ విమానములు దాడి జరిపెను.

### ఆక్యాబుమీద తీవ్ర విమానదాడి.

ఆక్యాబు రేవుమీద మే నెలలోను, జూను నెలలోను బ్రిటిష్ విమానాలు అనేక పర్యాయములు బాంబులు వేసియుండెను. జూలై మాసంలో మరొక నాలుగు పర్యాయములు విమానదాడి జరిగెను. అచటి భవనములు చాలా నాశనం చేయబడెను. నావలను నిర్మించెడి కర్మాగార భవనములమీదనే బాంబులు ఎక్కువగా వేయబడెను. అచటి విమానాశ్రయముమీదను, అచటనున్న స్టీమరులమీదను బాంబులు వేయబడెను. మర ఫిరంగులుకూడా కాల్చబడెను.

ఇయిట్రీనా వద్దనున్న విమానాశ్రయంమీద బ్రిటిష్ విమానాలున్నూ అమెరికను విమానాలున్నూ కలిసి బాంబులువేసెను. మాండలేకున్నూ, మిట్కియానాకున్నూ మధ్యనున్న రైలు మార్గంమీదఉన్న మోగాంగుపై అనేక పర్యాయములు అమెరికను విమానాలు దాడి వెడలెను. వర్షకార్తివల్లను, వానగాలివల్లను విమానదాడులు ఆటంకములేకుండా సాగింపబడెను.

---

# భారతీయ నావికుల సేవా ప్రశంస.

ఇంగ్లాండులో లివర్పూలునందు భారతీయ నావికుల కొరకు ఒక ఇష్టాగోష్ఠి మందిరము ఏర్పాటుచేయబడినది. ఆ మందిరమునకు ప్రారంభోత్సవం జరిగిన దినమున దానిని తెరచుచు, ఇండియా సహాయ కార్యదర్శియగు డివాన్షయిరు ప్రభువుగారు ఉపన్యసించిరి. అప్పుడు ఇంగ్లాండులో ఆక్టింగు హై కమిషనరుగా ఉన్న యస్. లాల్, ఐ.సి.యస్., గారు సభకు హాజరైరి. ఆ సందర్భములో డివాన్షయరు ప్రభువుగారిట్లు చెప్పిరి :—

"బ్రిటిష్ వర్తక నావలలో పనిచేయుచున్న నావికులలో నాల్గవవంతు భారతీయులుగా ఉన్నారు. మన సముద్ర వ్యాపారం సవ్యంగా సాగుచుండుటకై యీ నావికులు అనేక ఉపద్రవములకెదురొడ్డి పనిచేయుచున్నారు. వారికి మనము విశేషంగా కృతజ్ఞతా బద్ధులమైయున్నాము. వారు చేయుచున్న సేవ చాలా ముఖ్యమైనది. ఇటువంటి ధీరుల సౌకర్య సదుపాయములకొరకై మనము ఎంత తోడ్పడినప్పటికీ చాలదని నా నమ్మకము."

హై కమిషనరు గారిట్లు చెప్పిరి :—ఇంగ్లాండులోనున్న భారతీయ నావికులకు మంచి సౌకర్యములు ఏర్పాటుచేసి వారి విషయమై శ్రద్ధవహింపవలెననే ఆ సక్తితో ఉన్నాను. యుద్ధం వచ్చినప్పటినుంచీ, యీ భారతీయ నావికా సంఘము ఎక్కువ చురుకుగా పనిచేయుచున్నది. వీరి క్షేమం విచారించుచుండుటకొరకై ఇంగ్లాండులో ముగ్గురు ఆఫీసర్లు నియమింపబడి యున్నారు. వారిలో ఒక ఆఫీసరు లివర్పూలులో ఉన్నాడు.

ఈ ఇష్టా గోష్ఠి మందిరమును ప్రారంభించుటకు నావికులకొరకైన కింగు జార్జి ఫండు (యుద్ధ నిధి) లోనుండి 2 వేల పౌనులు ఇవ్వబడెను. యుద్ధ ప్రయోజనముల కొరకైన వైస్రాయి ఫండు 1942 వ సం॥ జూను 30 వ తేదీ నాటికి రూ 8,67,000 లు అనగా 65,024 పౌనులు వసూలయ్యెను. దానిలోనుంచి కింగుజార్జిఫండుకు వైస్రాయి కొంత ద్రవ్యమిచ్చియుండెను. ఈ విధంగా యిండియానుంచి కింగుజార్జిఫండుకు యివ్వబడిన ద్రవ్యములోనుంచి యీ యిష్టాగోష్ఠి మందిరమునకు ద్రవ్యసహాయం చేయబడినది. భారతీయ సౌకర్య సదుపాయముల కొరకైన నిధిలోనుండి కొంత ద్రవ్యమును రాణీగారు కూడా యీ మందిరమునకు యిచ్చిరి.

---

## మద్రాసు పటాలములలో జనహాని.

వేర్వేరు తేదీలయందు మద్రాసు పటాలములలో యీ క్రిందివారికి అపాయములు కలిగినవని తెలియజేయుటకు చింతిల్లుచున్నాము :—

### ఆఫీసర్లు.

కన్పించనందున యుద్ధ ఖైదీలుగా ఉన్నట్లు ఊహింపబడుచున్నవారు.

| నెంబరు. | హెూదా. | పేరు. |
|---|---|---|
| భారతీయ ఫిరంగి దళము— | | |
| | టి. మేజరు. | కుమారమంగళం, పి.పి. |

ఇదివరలో "కన్పించనందున యుద్ధ ఖైదీలుగా నున్నారని భావింపబడి" ఇప్పుడు పటాలములోనికి తిరిగి చేరుకొనినవారు.

| | | |
|---|---|---|
| ఐ.యం.యస్.— | | |
| యం.జడ్. 20747 | కాప్టెన్ | శ్రీనివాసన్, పి. సి. |

### వైస్రాయియొక్క కమీషన్డు ఆఫీసర్లు.

కన్పించనందున యుద్ధ ఖైదీలుగా నున్నట్లు భావింపబడుచున్నవారు.

| నెంబరు | హెూదా. | పేరు |
|---|---|---|
| మద్రాసు సాపర్లు, మైనర్లు పటాలము— | | |
| 12718 | వి. సుబేదారు ... | ఆదిలింగం. |
| 12806 | జమేదారు ... | రాజలింగం. |
| 13820 | జమేదారు ... | వెంకయ్య. |
| ఇండియను ఇంజనీర్లు— | | |
| ఇ/112832 | జమేదారు | రావు, జి. యస్. |
| ఆర్.ఐ ఏ.యస్ సి.— | | |
| 13568 | పి.ఏ. సుబేదారు. | చంద్రగాసన్. |
| యస్.ఆర్ / 120430 | జమేదారు | మహదేవన్, యన్.కే. |
| ఐ యం.డి.— | | |
| 65 యంఇ | జమేదారు | పరకి అచ్యుతరావు వేణుగోపాల్. |
| 97 యంఇ | జమేదారు | వెంకటేశ్వరన్. |

మరణించినవారు.

| | | |
|---|---|---|
| ఇండియను ఇంజినీరు— | | |
| 13973 | జమేదారు .. | కణ్ణన్, కే. |

### ఇతర హెూదాలలోవారు—

పోరాడవలసిన సిపాయీలు కానివారు.

ఇదివరలో "కన్పించనందున యుద్ధ ఖైదీలుగా నున్నట్లు ఊహించబడి" ఇప్పుడు యుద్ధ ఖైదీలుగా నున్నట్లు రూఢి చేయబడినవారు.

| | | |
|---|---|---|
| మద్రాసు సాపర్లు, మైనర్లు— | | |
| 17575 | సాపరు ... | అప్పలసామి. |
| 17297 | నాయక్ ... | దొరైసామి. |
| 18296 | సాపరు ... | ఒబ్బి ఎల్లయ్య. |
| 14644 | సాపరు .. | పొన్నుసామి. |
| 16918 | సాపరు | రాయప్పన్. |
| 17023 | లాన్సు నాయక్. | సీతారామ రెడ్డి. |
| 16108 | నాయక్ ... | సుబ్రమణి. |
| ఐ.యస్.సి.— | | |
| ఏ 3887 | సిగ్నలరు ... | కిష్ణన్. |
| ఏ 2671 | యు. లాన్సు నాయక్. | సుబ్రమణియం, టి సి. |
| ఐ.జి.యస్.సి.— | | |
| జి.యస్.యఫ్./ 8100 | మషాల్జి ... | దొరైస్వామి, జి. |

మరణించినవారు.

| | | |
|---|---|---|
| మద్రాసు సాపర్లు, మైనర్లు— | | |
| 19299 | లాన్సు నాయక్ (పి.డి.) | మునిసామి. |
| ఆక్జిలియరీ పయొనీరు దళము— | | |
| 189302 | లేబరర్ ... | నారాయణ నాయర్. |

| నెంబరు. | హోదా | పేరు. |
|---|---|---|

**గాయపడినవారు.**

మద్రాసు సాపర్లు, మైనర్లు—

| | | |
|---|---|---|
| 18319 | సాపరు | రాజగోపాల్. |

కన్పించనివారు.

| | | |
|---|---|---|
| 63723 | సాపరు .. | దేవరాజ్ షడయాచి |
| 1892 | వంటవాడు ... | శ్రీనివాసన్. |

ఐ.ఏ ఓ.సి —

| | | |
|---|---|---|
| ఓ/115711 | సిపాయి-టర్నరు, | అబ్దుల్ గఫూరు. |
| యం.టి / 948543 | సిపాయి-డ్రయివరు. | ఆర్ముగం. |
| 103367 | సిపాయి-ఫిట్టరు... | కోదండం, కే. |
| 103530 | డిటో. | పరాంకుశం, ఆర్. |

ఇదివరలో "కన్పించనందున యుద్ధ ఖైదీలుగా నున్నట్లు ఊహించబడి" ఇప్పుడు యుద్ధ ఖైదీలుగా నున్నట్లు రూఢిచేయబడినవారు.

మద్రాసు సాపర్లు, మైనర్లు—

| | | |
|---|---|---|
| 18390 | సాపరు | అబ్దుల్ సతార్ |
| 1100 | డబ్ల్యు సి.ఆర్. ... | దొరైస్వామి. |
| 13753 | లాన్సు నాయక్. | మహబూబుఖాన్. |
| 17271 | డిటో | మీరాఖాన్ |
| 17623 | సాపరు ... | మహమ్మదు యూసఫ్. |
| 1296 | భారతీయ పటాలములవంటవాడు | మునిసామి రావు |
| 16795 | సాపరు | షేకు ఇబ్రహీం. |

ఐ.హెచ్ సి.—

| | | |
|---|---|---|
| హెచ్/86172 | వి సిపాయి .. | లక్ష్మయ్య, బి. |

**మరణించినవారు.**

మద్రాసు సాపర్లు, మైనర్లు—

| | | |
|---|---|---|
| 1680 | డబ్ల్యు సి. | నారాయణస్వామి నాయుడు. |

ఐ.యస్.సి —

| | | |
|---|---|---|
| 9624 | సిగ్నలరు ... | కృష్ణా రావు. |

ఇండియను ఇంజనీర్లు—

| | | |
|---|---|---|
| 40396 | పయొనీరు ... | విలుమలై. |
| 50112 | డిటో ... | నారాయణస్వామి |
| 50123 | డిటో ... | సుబ్రమణి, పి. |
| 49834 | నాయకు | థామస్. |
| 49999 | పయొనీర్ .. | వెంకటప్ప. |

ఆర్.ఐ.ఏ.యస్.సి.—

| | | |
|---|---|---|
| యం టి. 901675 | సిపాయి ... | అలాదీన్ ఖాన్. |
| ,, 912512 | పి.ఏ ఎల్. నాయక్. | బలరాం. |
| ,, 910671 | సిపాయి ... | బంగారు. |
| ,, 944939 | సిపాయి ... | కున్హింబు నాయర్, పి. |

| నెంబరు. | హోదా. | పేరు. |
|---|---|---|

ఐ.ఏ ఓ.సి.—

| | | |
|---|---|---|
| ఓ 74240 | సిపాయి డి.ఆర్. | సుబ్రమణియం, వి. |

ఇతర హోదాలవారు—పోరాడు సిపాయీలు కానివారు—ఇదివరలో గాయపడినవారుగా ప్రకటించబడి ఇప్పుడు గాయములచే మరణించినవారు.

ఐ.యస్.సి —

| | | |
|---|---|---|
| 02650 | డబ్ల్యు.సి ఆర్. ... | చిన్నసామి. |

**గాయపడినవారు.**

మద్రాసు సాపర్లు, మైనర్లు—

| | | |
|---|---|---|
| 13016 | సాపరు | బుర్రాన్ షరీఫ్. |
| 17708 | సాపరు .. | మునిస్వామి |
| 18464 | సాపరు ... | శంకర్. |
| 16283 | సాపరు . | వరదన్. |

ఐ.యస్.సి.—

| | | |
|---|---|---|
| 25620 | సిగ్నలరు .. | దామోదరన్, ఇ |
| ఏ/3851 | సిగ్నలరు ... | పాకినాథన్, ఎస్. |

కన్పించనందున యుద్ధ ఖైదీలుగా నున్నట్లు ఊహించబడినవారు.

ఐ.యస్ సి.—

| | | |
|---|---|---|
| ఎ/1443 | సిగ్నలరు .. | చిన్నసామి |
| 05118 | పటాలపు వంటవాడు బి.డి.ఇ. 111. | దొరైరాజ్ |
| ఏ/3971 | సిగ్నలరు ... | కున్హిరామన్ నాయర్, సి.హెచ్. |
| ఏ/1560 | సిగ్నలరు .. | టి. వి. కుంజన్ కుట్టి నంబియార్. |
| 2651 | స్వీపరు | మునిస్వామి. |
| ఏ/3839 | సిగ్నలరు ... | నాగభూషణం |
| ఏ/8771 | సిగ్నలరు ... | రాజగోపాల్, కే. వి. |
| ఏ/2934 | సిగ్నలరు .. | రామనాథన్. |
| ఏ/1924 | యు.ఎల్.నాయక్. | యదార్థుడు. |

ఇదివరలో "కన్పించనందున యుద్ధ ఖైదీలుగా నున్నట్లు ఊహించబడినవారిలో" ఇప్పుడు యుద్ధ ఖైదీలుగా నున్నట్లు రూఢిపరచబడినవారు.

ఐ.యస్.సి.—

| | | |
|---|---|---|
| ఓ/2612 | వంటవాడు, బి.టి. | సామి. |

MADRAS PRINTED AND PUBLISHED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.